The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper
for H. E. H. The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును

హైదరాబాదు దక్కన్



**Golconda Patrika. Hyderabad, Dn.**

సంపుటము ౭ { శా. శ. ౧౮౫౪ అంగీరసనామ సం॥ర ఆషాఢ శు॥ ౧౩ శనివారము 16-7-32 { సంచిక ౨౧

## మహాత్మాజీ జాతకఫలితాంశము

1933 ఆగష్టు నెల మొదటివారమున్లండన్ నగరమున మూడవ రౌండుటేబిలుసభ ప్రారంభమగుట

10-2-1933 మొదలు 3-3-33 లోగా మహాత్మాజీవద్దకు రాజకీయ నాయకుల విడుదలజరుగును. 4.4.33 మొదలు 23.4.33 లోగా మహాత్మునకు ఆగ్నేయదిశకు ప్రయాణంజరుగును అనగా ఢిల్లీ నగరమునకు ప్రయాణంజరుగును. అచ్చట శ్రీ రాజసందర్శనము జరిగి జరుగబోవు రౌండుటేబిలు సభ విషయమై సంప్రతింపు జరుగును. మహాత్మునకు అనుకూల పరిస్థితులుగానేతోచును. అందులకు మహాత్మాజీ సమ్మతించును. 23.4.33 మొదలు 25.5.33 లోగా రాజకీయ నిర్బంధితుల విడుదలజరుగును. 7.6.33 మొదలు 4-7-33 లోగా జరుగబోవు రౌండుటేబిలు సభకు మహాత్మునకు లేఖా సన్మానం జరుగును. 1-7-33 మొదలు 25-7-33 లోగా మహాత్మాజీ రౌండుటేబిలు సభకు వెళ్లుటకు సముద్రయానంజరుగును. 21-7-33 మొదలు 3-8-33 లోగా లండన్ నగరముచేరును. అచ్చట సన్మానం జరుగును. జరిగే రౌండు టేబిలుసభలో శ్రీ రాజానుగ్రహముగలిగి అర్థఫలితమునకు తక్కువ లేకుండా మహాత్ముని సంకల్పము నెరవేరును. మహాత్మాజీ సమ్మతించును. 23.8.33 మొదలు 4.6.33 లోగా మహాత్మునకు శ్రీ రాజసన్మానంజరుగును. 22-9-33 మొదలు 16-10-33 లోగా అచ్చటనుండి మహాత్మునకు అన్య గ్రామముల సంచారం జరుగును. 1-7-33 మొదలు 2-11-33 లోగా మహాత్మునకు అన్యదేశీయులచే స్వర్ణనాణ్యములు సన్మానముగా లోనంగబడును. మొదలు 24-11-33 లోగా మహాత్మాజీ తిరిగి ఇండియాకు వచ్చుటకు సముద్రయానంజరుగును. 20-11-33 మొదలు 2-12-33 లోగా మహాత్మాజీ బొంబాయిచేరును. జరిగె రౌండుటేబిలు సభలో శ్రీ రాజానుగ్రహముచే ఇండియాకు ప్రాప్తించిన ఫలితములు 26-11-1934 లోగా అనుభవమునకు వచ్చును.

సర్వజ్ఞ శిఖామణి కెల్ల రామమూర్తి,
చీరాల- గుంటూరు డిస్ట్రిక్టు
(ఆంధ్ర)

## దౌర్జన్యనేరములక్రింద శిక్షింపబడిన ఖైదీలను అండమానులకు పంపుట

పార్లమెంటులో హోరుగారి ప్రకటన

లండన్, జూలై ౧౧:—

“ఇపుడు యిండియాలో దౌర్జన్యనేరములకు శిక్షింపబడినవారు చెరసాలలో నిబంధనలు భంగపరచుచున్నారు. గాన యీ నిబంధనలను కాపాడుటకుగాను వీరిలో ౧౦౦ మందిని ప్రస్తుతము అండమానులకు పంపునట్లు నిశ్చయింపబడెను. అని హోరుగారు నేడు పార్లమెంటుసభలో తెలిపిరి.

ప్రభుత్వోద్యోగుల జీతములను తగ్గించుట

“విదేశములోను, సంస్థానములలోను పనిచేయుచున్న బ్రిటిషు గవర్నమెంటు ఉద్యోగుల జీతములుగూడ మితివ్యయముకొరకు తగ్గింపబడును” అని ఇండియాదొరతనమువారు ప్రకటించిరి. ధనాభావముచేత సంస్థానములలో పనిచేయుచున్నవారి జీతములను తగ్గింపకూడదు” అని సర్ ఆర్. క్రాడకుగారు పార్లమెంటుసభలో తెలిపిరి.

“ప్రస్తుతము అన్ని చోట్లనుగూడ ధనాభావముగలదు” అని హోరుగారు తెలిపిరి.

## పటేలు డివిలెరా గార్ల సమావేశోద్దేశ్యము

### పటేలుగారి ప్రకటన

లండను, జూలై ౧౧:—

వి. జె. పటేలుగారు లండను తిరిగివచ్చిరి. రూటరు సందర్శింపగా తాను డివెలరాను జూచుట ముఖ్యముగ భారతదేశము యొక్క నిజమగు రాజకీయ స్థితినిగూర్చి మితవర్గములోని దగు ఒక యూరోపియను దేశాధిపతికి (ఐరిషు అధ్యక్షునకు) దెలుపుటకేయని నుడివిరి. ఇండియాలోని పత్రికల ఆర్డినెన్సులు, ఇతరఆర్డినెన్సులను గూర్చికూడ వారుమాట్లాడుకొనిరి.

వి. జె. పటేలుగారు డబ్లిను నుండి లండనువచ్చిరి "నేను మూడుసారులు డివాలెరా గారితో సంభాషించితిని. అయిర్లండు దేశమువారు మనకు మిత్రదేశము వారగుటచే ఆ దేశమునందలి ప్రభుత్వమునకు అధ్యక్షుడగు డివాలెరా గారికి భారత రాజ్యాంగ స్థితినిగూర్చి నేను తెలిపితిని. సెంట్రలు యిండియను యిన్ఫర్మేషను బీరో అనగా భారతదేశ పరిశ్రమలకును వాణిజ్యమునకును సంబంధించిన విషయములను తెలుపునట్టి సంఘమును యేర్పరుచుటను గూర్చి గూడ నేను మాటలాడితిని.

అయిర్లండులో త్వరలోనే రిపబ్లికు యేర్పడవలెనని కోరుచున్న వాదసంఖ్య మిక్కిలిహెచ్చుగా నున్నది. రిపబ్లికు యేర్పడునప్పటికిని వారు మెట్టి నిర్మాణ కార్యమునుగూడ తలపెటరు. అందువలన ప్రస్తుతము కలిగిన వివాదముతో అయిర్లండునకును ఇంగ్లాండునకును గలసంబంధము తొలగెననియే చెప్పదగును.

బ్రిటిషు వారిచ్చిన ఇండియాకు డొమినియను స్టేటసును యిచ్చినచో యిండియా వారు గూడ అయిర్లండు వారి పద్ధతినే అనుసరింప వలసి యుండును. భారతదేశమున డొమినియను స్టేటసు పనిచేయదు, గాన సంపూర్ణ స్వాతంత్ర్యము లభించువరకును ఆందోళనము జరుగుచునే యుండవలెనని యే నేనుతలంచుచున్నాను." అని పటేలుగారు నుడివిరి.

### డబ్లినులో ౩ వేల స్త్రీపురుషుల ఊరేగింపు

ఇంగ్లండు పట్ల ప్రతికూలవైఖరి

డబ్లిన్, జూలై ౯:—

ఇంపీరియలిజమును అణచుటకేర్పడిన సంఘము వారు ఒకయూరేగింపును యేర్పాటు చేసిరి. అందులో ౩ వేలమంది స్త్రీపురుషులు ఎఱ్ఱ జెండాలతో ఊరేగిరి. గ్రేటుబ్రిటను ఐర్లండు నుండి భూమి మొత్తమును రాబట్టుటకు జేయుచున్న ప్రయత్నములను గర్హించుటకు ఈ యూరేగింపును సాగించిరి. వీరు గావించిన తీర్మానములలో ఒకటి భారతదేశమునకు సంబంధించినది. ఇంగ్లండునుండి విడిపోయి స్వాతంత్ర్యమును బడయుటకు పాటుబడుచున్న భారతీయులకు తోడ్పడుటకు ప్రతిన్నగైకొనిరి. ఐరిషుప్రజలు ఇంగ్లాండునుండి విడిపోవు ప్రయత్నములును భారతీయుల ప్రయత్నములును అవినాభావసంబంధము లనిరి. ఇద్దరును ఒకేయుద్దేశ్యముతో పాటుబడుచున్నారనిరి. విఠలభాయి పటేలుగారు ఉపన్యాసవేదికపై నుండిరి. కాని మాట్లాడలేదు.

# సర్ అక్బర్ హైదరీగారి యుపన్యాసము

## హిందూ ముసల్మానుల ఐక్యత

జూలై ౧౪ వ తేదీనాడు నిజాము కాలేజీ విద్యార్థులకు సర్ హైదరీగారుపన్యసించిరి. హాలంతయు విద్యార్థులచేతనేకాక నగరమందలి ఉన్నతోద్యోగులచేతను నిండియుండెను. నిజాంకాలేజి ప్రిన్సిపాలగు టర్నరుగారు హైదరీగారి విషయమై కొంత ఉపన్యసించిరి. హైదరీగారి నెరుగనివారు లేరనియు, గతసంవత్సరము సర్ హైదరీగారు రౌండుటేబిలు సభలో పాల్గొని హైదరాబాదు గౌరవమును హెచ్చించిరనియు, వారు తమ కెన్నిపను లుండినను విద్యార్థులందరిప్రీతిచే అవకాశము కలిగించుకొని వచ్చినందులకు వారికి ధన్యవాదము లియ్యవలయుననియు చెప్పిరి.

సర్ హైదరీగారిట్లుపన్యసించిరి:—

నేనీనాడు ప్రత్యేకముగా తయారైన ఉపన్యాస మియ్యదలచుకొనలేదు. మీతో కొన్ని విషయములు మాత్రమే ముచ్చటింతును. సుమారు ౩౦ ఏండ్లనుండి నాకు ఒక్క సమస్య చాల ముఖ్యమైనదై యున్నది. సంఘ సంస్కర్తలలో గొప్పవారైనను మహాదేవ రనడేగారు 33 ఏండ్ల క్రిందట సాంఘిక గ్రంథముల ప్రచురించుచు నన్నును నొక పుస్తకము వ్రాయుమని కోరగా హిందూ ముసల్మానులఐకమత్యమును గురించి వ్రాసితిని. ఇన్నియేండ్లు గడచినను ఆసమస్య ముఖ్యమైనదిగా నున్నది. నేను బొంబాయి వాస్తవ్యుడను. అచ్చట నేడు జరుగుచున్న ఖూనీలు, లాటీలు చూడ నాకు చాల సంతాపము కలుగుచున్నది. భారతీయులు విదేశములందు కలసిమెలసి యుండుటయు స్వదేశములో కొట్లాడుటయు ఎందుకు సంభవించుచున్నది. ఇంగ్లాండులో హిందూ ముసల్మాన్ పార్సీ, క్రైస్తవులు ఐకమత్యముతో నుండుట నేను చూచియున్నాను. నిన్ననే నానారాష్ట్ర సమితి వారొక యుపసంఘమును నేర్పాటుచేసి వివిధ దేశములలో చరిత్రబోధ యేరీతి యున్నదో యికముందు ఎట్లు బోధచేసిన ప్రపంచమం దైక్యత కలుగునో విచారించుమని నియోగించినారు. ఇది నా మనస్సులో నాటినది. నేడు హిందూస్థానములో నిఃపరిస్థితులకు ముఖ్యకారణము హిందూదేశ చరిత్రను తప్పు పద్ధతులపై వ్రాయుటయు బోధించుటయు నైయున్నది. పాఠశాలలోని పుస్తకములు అనవసరముగా యుద్ధములను, ఖూనీలను (రక్తపాతములను) మతసంబరధపు అవమానమును వీనికి ప్రాముఖ్యతనిచ్చి, ఈ దేశమును పాలించిన రాజులు తమ మత సహిష్ణుతను చూపించిన యంశములను నిర్లక్ష్యము చేయుచున్నది. టిప్పుసుల్తాను బ్రాహ్మణ పూజాదులను తనకు జయముకలుగుటకై పూజలు గావింపుమని చెప్పుచుండెను. ఔరంగజేబు కాశీదేవాలయములకు సహాయము చేసెను గ్వాలియర్ రాజగు సింధియా పీర్లపండుగను షియ్యాలరీతిగా ఆచరించుచుండెను. ఒక పత్రికలో నిటీవల యెవ్వరో హైదరాబాదులో ఆవుపరమును ప్రదర్శింప కూడదని శాశించినారని వ్రాసిరి. అది అబద్ధము పైగా మన శ్రీ నిజాముగారు "ఈద్" రోజున ఆవును కోయ కూడదని శాసించినారు. శివాజీ మసుమనికి తురకపేరును పెట్టియుండిరి. కావున మనకు కావలసిన దేమన మన దేశ చరిత్రను మరల మంచి పద్ధతులపై వ్రాయనగును. హైదరాబాదు భూగోళమందు మధ్యస్థముగా నున్నట్లే దానిని హిందూ దేశాభి వృద్ధికి కేంద్రముగా జేయ యత్నింపుడు."

లారెన్సు విగ్రహమునుభంగపఱిచిన సిక్కులకుశిక్షలు. రెండేడ్లుఖైదు రు 25 జరిమానా

లారెన్సు శిలావిగ్రహమును భంగపఱిచినందులకు అజగరసింగుగారును మఱిముగ్గురు సిక్కులును రెండేడ్లు కఠినఖైదు రు 25 జరిమానా విధింపబడిరి. నిందితులు కాపుర్తారారాజ్యమునకు [illegible] మేజిస్ట్రేటు లూయీగారు కేసును విచా[illegible] ప. కో. 447, 427 సెక్షనుల క్రింద నేరస్థులని నిర్ణయించిరి. విడుదలయైన వెనుక ఒకయేడాదిపాటు సత్ప్రవర్తన గల్గియుండునట్లు రు 500 ల హామీ జూపవలెననికూడ మేజిస్ట్రేటు తీర్పుజెప్పెను.

## పట్టాలకడ్డముగ జట్కాబండి కట్టబడియుండుట

### డ్రైవరు ముందుగా చూచుటచే అపాయము తప్పెను

మధుర, జూలై 9:—

మధుర ధనుష్కోటి రైల్వే లైనుమీద రామనాథుని పాలుపూరమున నొక అపాయము సంభవించి యుండెడిది. కాని డ్రైవరు ముందుగా చూచుటచే అపాయము కలుగలేదు. రయిలుబండి రాత్రి 9 గంటలకు రామ్నాడు స్టేషనును విడిచి బయలుదేరిన కొంతసేపటికే అకస్మాత్తుగా ఆపబడినది. రైల్వేలైను అడ్డము జట్కాబండి యొకటి గుఱ్ఱముతోగూడ కట్టబడియుండెను. రైలుబండిని ఆపి జట్కాను లైనుండిను తొలగించిన తర్వాత 23 నిమిషములకు మరల బండి బయలుదేరెను. జట్కావాడు యెూగలేని సమయమున వాని విరోధు లెవరో అతనిపై పగదీర్చుకొనుటకై అట్లు చేసిరని తెలియుచున్నది. మధుర రైల్వే పోలీసువారు విచారించుచున్నారు.

---

## న్యూసు క్రానికలు

భారత రాజ్యాంగ నిర్మాణములో ఇకమీదట పార్లమెంటువారము కావలెనని భారతమితవాదులు చేయు ప్రకటనమును గూర్చి న్యూసు క్రానికలు పత్రిక ఇట్లు వ్రాయుచున్నది. బ్రిటిషు ప్రభుత్వమునకు మిత్రులగు భారత మితవాదుల సహాయము లేనిచో ఇండియా మంత్రి సూచించిన పద్ధతులమీద భారత రాజ్యాంగ నిర్మాణము యభివృద్ధి గాంచజాలదు. అందుచే న్యూసు క్రానికలు పత్రికలో స్త్రీల సలహా సంఘమువారు ప్రకటించినటుల ప్రభుత్వమువారు ఉదార భావముతో మెలగుట యవసరము.

### మార్నింగుపోస్టు నిరసనము

మార్నింగుపోస్టు పత్రికవారు తెలిపిన విధానమునకును ఇదివరలో కార్మిక ప్రభుత్వ విధానమునకును ముఖ్యమగు వ్యత్యాసము లేదనియు చివరకు ఈరెండు విధానములలోను ప్రభుత్వమువారు భారతీయాభిప్రాయమునే స్వీకరింప నున్నారనియు వ్రాయుచున్నది.

మితవాదుల ఖండనమును గూర్చి వీరు వీరాలికోపడవను పట్టువారేకాని వేరు కాదనియు నానాయు ప్రభుత్వమును బెదరించుట కిటుల చేయుచున్నారనియు క్రమేణా ఇండియా మంత్రి ఏమిచేసినను అయ్యది మితవాదులకుగాని అతివాదులకుగాని నచ్చింపదని మార్నింగుపోస్టు తెలిపికొనగోరుచున్నది.

---

### ఒకవిద్యార్థి మోటారు ప్రమాదమువలన తీవ్రగాయములు పొందుట

కె. వి. కృష్ణమూర్తి అను విద్యార్థి నిన్నటి దినమున గుమ్మిడిపూండి దగ్గర నొక మోటారు ప్రమాదము వలన తీవ్ర గాయములనుపొంది నేటి యుదయమున పట్టాసుకు తీసికొనిరాబడి జనరలు ఆస్పత్రిలో చేర్చబడెను. అతడు స్పృహ తప్పి యున్నాడు.

---

## అంతర్జాతీయ బ్యాంకు వ్యవహార నిర్వాహక వర్గము

లాసేన్ సమావేశమునందు యేర్పాటు కాబడిన తమ కర్తవ్యమును నిర్వహించుకొనుటకై అంతర్జాతీయ బ్యాంకు వ్యవహార నిర్వాహక వర్గమువారు యీనాడు అంగీకరించిరి. ప్రపంచ వ్యాపార పరిస్థితులు బంగారు ప్రమాణమువల్లనే చక్కబడగలవనియు, సమరుల విడుదల, మూలధనము, యుద్ధ ఋణముల సమస్య, అన్ని దేశముల ఆంతరంగిక ఆర్థిక పరిస్థితులు, మున్నగు విషయములన్నియు బాగుగ గమనింపవలెననియు బ్యాంకువారు ప్రకటనమును గావించిరి. పై విషయముల నుగూర్చి అన్ని ప్రభుత్వమువారు తూష్ణీభావమును వహించినచో ఆర్థిక పరిస్థితులు బాగుపడ జాలవనియు, బంగారు ప్రమాణమునకూడ త్వరలో యేర్పాటు కాబడ జాలదనియు బ్యాంకువారు తమ ప్రకటనమున తెలియజేసిరి.

---

### బొగ్గుగనుల పనివాండ్ర సమ్మె

బైరిస్లోగారిచే యేర్పాటు చేయబడిన సంప్రదింపుల సమావేశపు తీర్మానము ననుసరించి ఉత్తరాది బొగ్గుగనుల పనివాండ్రు పనికి బోవుటకై నిశ్చయించిరి. ప్రధానామాత్యుడు ఫోర్డ్ గారున్నూ కార్మిక మంత్రియగు హామిల్టనుగారున్నూ సదరుక సమావేశమునకు హాజరయినియు యిదివరలో మిల్లుల అధికారులు నిరాకరించిన పద్ధతి ప్రవరణ చేయబడినదనియు, అట్టి పద్ధతిని సదరు అధికారులు యిప్పుడు ఆమోదించిరనియు తెలియుచున్నది.

---

### చెట్టువిరిగి బడిపై బడుట

మద్యాహ్నము ఒక చిన్న బడిలో పిల్లవాండ్రు చదువుకొనుచుండగ ఒకవృద్ధ వృక్షము విరిగి బడిపై పడగా, ఇంటి కప్పు పిల్లవారిపై బడెను. ఒకరితల కొట్టెను మున్నుపు ప్రమాదాకస్థులు నున్నారు చాలమందికి దెబ్బలు తగిలెను.

---

### బెల్జియములో పారిశ్రామికపు అల్లరి

బెల్జియములో పారిశ్రామిక అల్లరి ప్రబలినను పెరిగిపోవుచున్నది. చార్లరాయి ప్రదేశములో సమ్మెను ప్రకటించిరి. ౫౦ కమ్యూనిస్టు నాయకులు అరెస్టు చేయబడిరి. మాస్కో ఉత్తరువుల ప్రకారము వీరు ప్రవర్తించి దేశ్పు కమ్యూనిస్టులతో కలసిపనిచేయు చున్నారను నేరమును వీరిపైమోపిరి. ప్రజలలో యుద్ధమును పురికొల్పు చున్నారను నేరమును పైకిమా త్రము కల్పించినటుల ఆక్షేపించిరి.

---

## దోపిడికి మరణశిక్ష

### కాశీకేసులో తీర్పు

కాశీజిల్లాలో సేన జయంపురమునందు మన్నారంగ రాజు, దేవనారాయణ, జగన్నాథ ప్రసాద్, జయత్, విభూ అనువారలు కల్యాణ అనువాని యింటిముట్టి యింటివానిని కొట్టి, ఆస్తిని దోపిడిజేసిరి. తీవ్రముగా దెబ్బలు తిన కల్యాణసూగారు దెబ్బలబాధచే తుదకు ప్రాణము విడిచిరి. కోర్టు సెషన్సుజడ్జిగారు విచారించిన మన్నారంగ రాజు అనువానికి మరణదండనయు రక్కన ౪ గురకు యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షయు నొసగిరి.

---

## హూవరుగారు చేసిన పని తప్పని యూరోపియనులకుగూడ తెలియును

"హూవరుగారు యిట్టి ప్రకటన చేయుట చాల అనుచితమను విషయము యూరోపియనులకుగూడ తెలిసియేయున్నది. సత్యాగ్రహమును సలుపుట యుచితమని యెవరును యెన్నటికినిగూడ సమర్థింపజాలరుగాని భారతమితవాదులు యిటుపైని సహకారమును చేయజాలమని తెలుపుటకు మాత్ర మిపుడు వారికి తగిన కారణము చేకూరినది. బ్రిటిషు దొరతనమువారు రివుడైననను చేసినతప్పిదమును దిద్దుకొని మరల రాయభారములను జరుపుటకు తగిన అవకాశమును వెంటనే కలుగచేయవలెను" అని టైమ్సు అఫ్ యిండియా (యూరోపియను పత్రిక) వ్రాసెను.

---

## మరల భారతనాయకులకును దొరతనమువారికిని ప్రబలవిభేద మేర్పడినది

మనము మరల సైమను సంఘమునాటిస్థితికి వచ్చితిమి. ఈమధ్యకాలమున రౌండుటేబులుసభను యేర్పరచుటవలన కొంత సామరస్యము కలిగినది. భారతదేశమున ప్రజాప్రతినిధి సంఘములు సరిగా పనిచేయుటకు యెవరిసహాయమును ముఖ్యావసరమో అట్టి భారత రాజకీయ పక్షములవారికిని బ్రిటిషు దొరతనమువారికిని మరల ప్రబలవిభేద మేర్పడినది. మితవాదనాయకులకు భారత దేశమునందెట్టి పలుకుబడియునులేదు. కాన వారిసహాయమిపుడు దొరతనమువారికి లభింపక పోయిననుగూడ గొప్పప్రమాదమేమియును కలుగదు. వారు వ్యక్తిపరముగా విఖ్యాతులుగా ఆర్తిగా మాత్రమే వారి సహకారము ప్రయోజకరమైయుండును, ఒకటి రెండు వత్సరములలోపలనే షంపూర్ణమగు అధినివేశిక స్వపరిపాలనమును బడయవలెనని యిండియాలో అన్ని రాజకీయ పక్షములవారు గూడ కోరుచున్నారు. అధినివేశిక స్వపరిపాలనము నియ్యగూడదని ప్రస్తుతమున్న పార్లమెంటువారు దీక్షబూనియున్నారు. ఈ రెండుపక్షములకును యేదో యొకరీతినిసమాధానము కలుగుటకు అత్యవసరమైయున్నది. భారతనాయకులు కోరిన స్వపరిపాలనమును బ్రిటిషువారు నియ్యదలచుకొనలేదని స్పష్టమైనది గాన తామియ్యదలచుకొనిన దేదో దానినైనను కడు శీఘ్రముగా నియ్యవలెను. అల్పసంఖ్యాకుల సమస్యను తాత్కాలికముగా పరిష్కరించి దానిని ప్రకటింపవలెను. ఇండియా గవర్నమెంటు చట్టముప్రకారము ఫెడరలు రాజ్యాంగ విధాన చట్టమును పార్లమెంటులో నుపపాదించి త్వరలో దానిని నమలుజరుపవలెను. వీటి నన్నిటిని చేసిననుగూడ భారతదేశమున శాంతికలుగుట అసంభవమే యైనను దొరతనమువారిప్పటిస్థితిలో చేయదగినది మరేదియునులేదు. కాన నిపుడు మితవాదులు దొరతనమువారికి సహాయము చేయకపోవుటవలన నింతకంటె హెచ్చునష్ట మేదియును కలుగదు" అని మాంచెష్టరు గార్డియను పత్రిక వ్రాసెను.

---

## మరల ఆర్డినెన్సును అమలుపెట్టుట అక్రమము

బ్రిటను దేశపు మతగురువులు
అసమ్మతిని తెలుపుట

లండను, జూలై ౧౦:—

అండ్రూసుగారు ఆక్సుఫర్డులో మతగురువుల సభలో చాల ఉపన్యాసములనొసగిరి. "టాగోరు గారికిని గాంధిగారికిని జరిగిన లేఖలవలన శాంతిని కలిగించుటకు గొప్పఅవకాశముకలిగినను హోరుగారు దానిని తిరస్కరించి మరల ఆర్డినెన్సును అమలులో పెట్టుట అక్రమము" అను తీర్మానము ఆసభలో యేకగ్రీవముగా నామోదింపబడెను.

కాంటరు బరీడీనుగారు చీనానుండి రాగానే ఇండియాలోను చీనాలోను రైతుల దుస్థితినిగూర్చి అండ్రూసుగారు డీనుగారితో మాట్లాడెదరు.

## ఇండియాలో అఖిల రాజకీయ పక్షసభను జరుపవలెను

ఇటువైని మితవాదులు దొరతనమువారితో
సహకారమును జసుపకూడదు

మితవాదుల తంతివార్త

అలహాబాదు, జూలై ౧౧:—

లీడరు పత్రికకు సంబంధించిన కృష్ణారాం, బెహారిలాలు పి. ఎం. సప్రూగార్లు మున్నగు మితవాద నాయకులు చాలమంది బొంబాయిలోసర్ కౌస్జీ జహంగీరు (జూనియరు) గారికి తంతివార్త నంపిరి"

"ప్రస్తుతము మితవాదులు దొరతనమువారితో నెట్టి సహకారమును సలుపకూడదు. వారు అఖిలపక్షసభను త్వరలోనే జరుపవలెను. అప్పుడందరును కలిసి కర్తవ్యమును నిర్ణయింపవలెను" అని వీరువ్రాసిరి.

## కాంగ్రెసుతో సానుభూతి చూపనివాడెవడు?

చింతామణిగారి యుపన్యాసము

యజ్ఞేశ్వరచింతామణిగారు (ఆంధ్రమితవాదులు) మొన్నటిదినము బొంబాయిలో నుపన్యాసమిచ్చుచు నిట్లుపలికెను. హోరుగారి యుపన్యాసములో చాలలోతైన రహస్యమున్నది. వారుమనకు రాష్ట్రీయాధికారము మాత్రమే యియ్యనెంచినారు. అంతకన్న హెచ్చియ్యరు. ప్రభుత్వమువారి ఆర్డినెన్సులు చాల అనాగరికపు పద్ధతులు వీనిమూలమున హిందూస్థానీల సహకారము నాశనమగుచున్నది. విదేశస్థుల పరిపాలనను వదలింటకు నిశ్చయించిన దేశమును చాలకాలము అణచియుంచజాలరని బ్రిటిషువారు గమనింపవలెను. హోరుగారు ఈ ఆర్డినెన్సులను మరల చేసినను ఒక్కమారుకాక పదిమారులు చేసినను జనుల యుత్సాహమును అణచివేయజాలడు. పాలితులకు పాలకులకు ఎచ్చటెచ్చట యుద్ధములు జరిగినవో అచ్చటచ్చట జాతీపక్షవాదమే గెలిచినది హోరుగారికీ సంగతి తెలియకుండిన వారు ప్రపంచ చరిత్రను చదివి లాభములేదు.

ప్రభుత్వమువారు కాంగ్రెసును అణగద్రొక్క జూచుచున్నారు. కాని వారి యాక్రమయంతయు వ్యర్థమే. కాంగ్రెసుతో సానుభూతిజూపనట్టి ఆత్మగౌరవముగల హిందూస్థాని యెక్కడైనను ఉన్నాడా అని సంశయముగలుగుచున్నది. ప్రభుత్వమువారు తమపద్ధతిని మార్చుకొని నాగరిక పద్ధతులను నెలకొల్పవలెను.

## మితవాదులస్థానమేది?

గార్డియన్ అను లండనుపత్రిక మనమితవాదులు మొన్నబొంబాయిలో సభచేసి బెదరించు దానికి [illegible] బావాబిచ్చుచున్నది.

ఈ "ప్రసిద్ధవ్యక్తులు" అనగా మితవాదుల యొక్క సహకారము లాభప్రదముగానే యుండెడిది. కాని ఈ వ్యక్తులకు అనుచరులు లేనట్లేయున్నందున వారు బ్రిటిషువారితో సహకారము చేయకున్నను బాధకములేదు. ఒక్క విషయము మాత్రమునిజము. ఇండియాలో అన్నిపక్షముల వారును డుమినియన్ హక్కు కావలెననుచున్నారు. పార్లమెంటుదానిని బిగియబట్టుచున్నది. కావున నేడో యొకవిధమగు రాజీ అవసరమగును. అయినను మితవాదుల సహకార నిరాకారణము వలన ప్రభుత్వమువారికేమియు నష్టములేదు.

## అంబేడ్కరు అనుచరులపై కొట్లాట నేరము

బొంబాయి జూలై ౧౧:—

నిమ్నజాతుల సభయొద్ద కావలెనని గాయపఱచిన నేరమునకు ౯ మంది అంబేడ్కరు అనుచరులు రాజధాని మూడవ మేజిస్ట్రేటు కోర్టులో హాజరు పెట్టబడిరి. వారిని తలారు ౩౦ జామీనుమీద విడుదలచేయుటకు మేజిస్ట్రేటు అనుమతించెను కాని ఆ జామీను ఇచ్చువారు లేనందున ౧౯ వ తేదివరకు రిమాండులో నుంచుట కాజ్ఞాపించెను

## సుభాషు బోసుగారి అనారోగ్యము

కలకత్తా, జులయి, ౧:—

శ్రీయుత సుభాషుబోసుగారి ఆరోగ్యము చాలా చెడిపోయినదని తెలియుటచే వారి సోదరుడును వైద్యుడునైన మశిలబోసు గారు వారిని దర్శించి పరీక్షింప ననుమతి కోరిరి. కాని వారికి అనుమతి నిరాకరింపబడెను. చేయదగిన దంతయు ప్రభుత్వము చేయుచున్నదనియు వారిని ఆసుపత్రిలో ప్రవేశపెట్టి కాలంకషము గా పరీక్షింప జేయవలెనని ఇండియా ప్రభుత్వమునకు వ్రాసి యున్నారనియు తెలియజేసిరి

## ఉదయపూరులో కల్లోలము

మహారాణాగారి నగరిపై దండెత్తుట
పోలీసు మిలిటరీ కాల్పులు

సిమ్లా, జూలై ౧౧:—

ఉదయ పూరునందు తీవ్రమైన అల్లరి చెలరేగినది మహారాణాగారి నగరిపైకి జనము దండెత్తి వచ్చిరి పోలీసులును మిలిటరివారును తుపాకులు కాల్చి జనమును పారద్రోలిరి ౨౧ గురికి గుండుదెబ్బలు తగిలెను వివరము లింకను తెలియలేదు,

## యువతిని బలత్కారముగ లాగుకొని పోవుట

మహమ్మదీయ మతమును
స్వీకరింపుమని బెదరించుట

కౌన్పూరు నగరమున, మిస్ ఫ్రాంక్లిన్ అను ౧౮ సంll ల కన్య నాయీ సారక్ వద్దనున్న హైస్కూలునుండి యింటికి వచ్చుచుండ నల్వురు ముస్లిమ్ యువకులు, దొంగతనముగ వెనుకప్రక్కగ వచ్చి యెత్తుకొనిపోయిరి ఒకయింటిలో నాయువతినిదించి మహమ్మదీయ మతమును స్వీకరించి వారిలో నొకరిని పెండ్లియాడుమని చెప్పిరి. అందులకు నామె తిరస్కరించినందున తాము చెప్పినయట్లు వినకపోయినచో కత్తితో పొడిచివేయుమని భయపెట్టుచుండిరి. ప్రాణాపాయమునకు దడసి సంసిద్ధురాలయ్యెగాని పెండ్లియన్న పెడచెవిని బెట్టెను ఆమెను ఒకయింటిలో బెట్టి తాళము వేసిరి ఆయమ్మాయి పాపమేవిధముగ నుత్తరమువ్రాసి పోస్టునందు వేయించగలిగెనదో నొక యుత్తరమువ్రాసి తన నిస్సహాయ స్థితిని తండ్రి, తెలియజేసెను. వెంటనే తండ్రి జిల్లా మేజిస్ట్రేటు కోర్టులో క్రిమినల్ ప్రొసీజరుకోడ్ ౧౦౧—౧ సె క్రింద చార్జి దాఖలు జేసెను మేజస్ట్రేటుగారు తండ్రి వాఙ్మూలమును తీసికొని సెర్చి వారెంటును జారీ చెయవొసగిరి. వెంటనే పోలీసులు బందోబస్తుతో బయలుదేరి దాచియున్న యింటిని చుట్టుముట్టిరి విద్యార్థిని ఫ్రాంక్లిన్ కన్య సదరు యింటిలో దొరికెను. వెంటనే నామెను జిల్లా మేజస్ట్రేటువద్దకు తీసికొనివచ్చిరి. మూసాయానవద్దకు చెప్పెదనని కన్య కోరగా కలెక్టరు అట్లులే తీర్మానము యిచ్చిరి ముస్లిమ్ యువకులపై చర్య తీసికొనుటను తెలియుచున్నది.

